Registered No. M 1118

ప్రతి ౧-కి 6 పైసలు





ప్రతిదినము ప్రకటింపబడును

VOL. I. సంపుటము. ౧. | చెన్నపట్టణము 1914 సం॥ నవంబరునెల 8 వ తేది ఆదివారము. ఆనందనామ సంవత్సర కార్తీక బహుళ షష్ఠి. | సంచిక. ౨౦౩ No. 203

# ఐరోపా మహాసంగ్రామము.

## ఇంగ్లాండు-ఫ్రాన్సులు.

### యుద్ధమునుగూర్చిన రిపోర్టులు.

వైస్రాయిగారికి వచ్చినతంతి.

లండను, నవంబరు 6:— లండనునుండి 5 వ తేదిని స్టేటు సెక్రటరీ గారియొద్దనుండి వైస్రాయిగారికి టెల్లిగ్రాము వచ్చినది:— ఫ్రాన్సు బెల్జియము సరిహద్దులదగ్గర స్థితిగతులు నిన్నటివలెనే యున్నవి. ఫిరంగులు వేయుటలోను, ఇతర వ్యవహారములయందు నుభయపక్షములవారిలోను మార్పేమియులేదు. మిత్రమండలివారు వారిస్థానము నిగ్రహించుచున్నారు.

### తూర్పుప్రష్యాలో రష్యావారిజయము.

తూర్పుప్రష్యా సరిహద్దు స్థానములందు జర్మనులు వెనుకకు మరలుచున్నారు. ఎడమవైపు సేనలయందిది విశేషముగా కనుపట్టుచున్నది. బకలార్జివో పట్టణమును రష్యావారు పట్టుకొనినారు. ఇప్పటిచాల ఆయుధములు మందుగుండుసామాను దొరకినది. రష్యనులు కీల్సిదగ్గర ఆస్ట్రియనులను తరిమివేసినారు. చాలముఖ్యస్థానమగు [illegible] డావిడ్జను వశపఱచుకొనిరి. 206 ఉద్యోగస్థులను 16,000 సైనికులను, చాలఫిరంగులను యంత్రపు ఫిరంగులను పట్టుకొనబడినవి.

### జనరల్ జాఫ్రీగారి అభివాదములు.

గ్రాండు డ్యూకు నికొలాస్ గారికి తమ అభివాదములను తెలుపుచు జనరల్ జాఫ్రీగారొక టెల్లిగ్రామును పంపినారు. రష్యనుసేనల దిగ్విజయమునుగూర్చియు, ఇటీవల గాంచిన జయముచే జర్మనుల సరిహద్దు ప్రాంతములు సమీపించగలిగినందుకును అభినందించి పిమ్మట నిట్లు వ్రాసిచ్చిరి:— మా పక్షమున జర్మనుల తీవ్రమగు మాటలను నిలుపగలిగితిమి. మమ్ముల నెదిరించుచున్న శత్రుపక్షపు సేనలను నిర్మూలము చేయుటకై ప్రయత్నించుచున్నాము. మన స్థితిగతులు అనుకూలముగ నున్నవి. మనమందఱ మైకమత్యముచే జేయుచున్న కృషివలన త్వరలో జయము చేకూరునని నమ్మెదను.

### డార్డినెల్సుపై ఫిరంగులు.

డార్డనెల్సు కింకను ఫిరంగులు పెట్టి కొట్టుచునే యున్నారు. ఆంగ్లరాయబారి కాన్స్టాంటినోపిలునుండి లేచిపోయినాడు. లండనులోని తురుష్కరాయబారి వెడలిపోవుటకు పత్రములను పొందినాడు.

### సైప్రెస్సును స్వాధీనపఱచుకొనుట

ఆంగ్లప్రభుత్వమువారు సైప్రెస్సులంకను స్వాధీనపఱచుకొనిరని లండను గెజెట్టు ప్రకటించుచున్నది.

### రష్యనులు, తురుష్కస్థానము.

తమసేనలు అలాష్కరు, ముత్కోన్స్కి గ్రామములను పట్టుకొనినవని రష్యాసేనాధికారులు తెలియజేయుచున్నారు.

### ఈజిప్టు స్థితిగతులు.

ఈజిప్టుదేశపు ప్రధానమంత్రి నొక ఇటలీ పత్రికాప్రతినిధి కలిసి సంభాషించినారు. ఈజిప్టుదేశపు అధికారులును, బ్రిటిష్ వారి ప్రతినిధులును, ఐకమత్యముతో పనిచేయుచున్నారని మంత్రిగారు చెప్పినారట.

ఈజిప్టువిషయమై జర్మని ఛాన్సలరుగారు హాలెండుదేశపు పత్రికాధిపతులతో ముచ్చటించిన సంగతులకు లిబరల్ పార్టి నాయకులగు మహమ్మదు బేగారు ప్రత్యుత్తరమిచ్చుచు ఈజిప్టుదేశమును ఆంగ్లప్రభుత్వము వారురక్షించుచున్నందునకు దేవునికి నమస్కరించుచున్నామనియు, ఇందువలన తమదేశము అనాగరికము, దండయాత్రలు మున్నగువానినుండియు, లోవైజ్ రీమ్సునగరములకు సంప్రాప్తమైన గతినుండియు, తప్పించుకొనెననియు, చెప్పిరి.

### బాకు మహమ్మదీయులు.

బాకులో 10 వేల మహమ్మదీయులు రష్యావారికి జయము చేకూరవలయునని ప్రార్థనలు చేసినారు.

### దక్షిణాఫ్రికా గోలము.

దక్షిణాఫ్రికాలోని తిరుగబాటు దాదాపుగ నశించిపోయినది. మారిటుయొక్క సైనికులు చెదరగొట్టబడిరి. బేయర్సు యెక్కడకో పారిపోయినాడు. జర్మనులు వెనుకకు పోవుచున్నారు.

### యార్కు యుద్ధనావ.

తమ యుద్ధనావయగు యార్కు తామే పెట్టిన మందుగనులకు తగిలి మునిగిపోయినట్లు జర్మను దొరతనమువారు ప్రకటించినారు.

---

## నౌకాయుద్ధము

ఢిల్లీ నవంబరు 7:—ఇండియాస్టేటు సెక్రెటరీ గారు వైస్రాయిగారికి ఈక్రిందిటెల్లిగ్రామును పంపిరి:— నౌకాదళాధికారులు ఈక్రిందివిషయమును నవంబరు 6 వ తారీఖున ప్రకటించిరి:— దక్షిణ అమెరికా దేశమందలి ఛిలీదేశపు సముద్రతీరమున నౌకాయుద్ధము జరిగినట్లు అనేకవార్తలు వచ్చినవి. అనేకవదంతులు పుట్టినవి. నౌకాదళాధికారులకు ఈవార్త అధికారులద్వారా తెలియలేదు. వార్తలు జర్మనివారిద్వారా వచ్చినవి. షార్న్ హార్స్టు, గ్నీసెనో, డ్రెస్డెన్, న్యూరెంబర్గు అను జర్మని యుద్ధనావలు వాల్పరైజోదగ్గర కూడియున్నవనియు, అడ్మిరల్ క్రాడక్ గారి నాయకత్వము క్రింద నున్నకొన్ని ఇంగ్లీషు నావలతో నవంబరు 1 వ తారీఖు ఆదివారమునాడు యుద్ధముచేసినవనియు, తెలియవచ్చినది. మాన్మత్ అనునావ ముంచివేయబడినదనియు, "గుడ్ హోప్"ను గొప్పదెబ్బలు తగిలినవనియు "గ్లాస్గో" "ఒట్రాంటో" అనునావలు పారిపోయినవనియు జర్మనులు చెప్పుచున్నారు. నౌకాదళాధికారులు ప్రస్తుతము ఈవార్త నిజమని నమ్మరు. ఏలననగా అడ్మిరల్ క్రాడక్ గారి సాహాయ్యమునకు "కానోపస్" అను యుద్ధనావ పంపబడినది. దీని సాహాయ్యమువలన క్రాడక్ గారికే జయము కలుగవలసియుండెను. జర్మనివారు చెప్పువార్తలలో దీనిపేరునైన ఎత్తుకొనలేదు. ఇంతేగాక, ఛిలీదేశమున కీ జర్మను యుద్ధనావలు ఉన్నవిగదా! వాల్పరైజోరేవులోనికి నూడే వచ్చుటయేమి? తక్కిన రెండు ఏమైనవి? కాబట్టి జర్మనివారు చెప్పు ఈ నౌకాయుద్ధముయొక్క సత్యాసత్యముల వివరములు తెలిసినగాని నమ్ముటకు వీలులేదు. ఈవార్త నిజమైననుసరే, అబద్ధమైననుసరే, నౌకాదళాధికారులు అవసరమగు ఏర్పాటులను చేయుచున్నారు.

నౌకాదళాధికారులకు ఇంకవరకు వివరములు తెలియలేదు. వివరములకై ఎదురుచూచుచున్నారు.

[మాన్మత్ నావ 9800 టన్నుల బరువుగలది. గుడ్ హోప్ 14100 టన్నుల బరువుగలది. ఈరెండు 1899 సం॥ లోనే తయారైనవి.]

### జనరలు వాన్ క్లక్.

నామూరులో చనిపోయినట్లు తెలియవచ్చుట.

లండను నవంబరు 6:—జనరలు వాన్ క్లకుగారు దెబ్బలుతగిలి నామూరునందు వైద్యశాలలో చనిపోయినట్లు చెప్పుచున్నారు.

---

### చనిపోయిన మేజరు జనరల్ కెక్ విచ్ గారు.

లండను నవంబరు 6:—మేజరు జెనరల్ కెక్ విచ్ గారు ఆత్మహత్య చేసికొన్నారని పంచాయితీదార్లు తీర్పుచెప్పినారు. కెక్ విచ్ గారు చాలకాలమునుండి మనోవ్యాధిచే బాధపడుచుండిరని డాక్టరు చెప్పినాడు.

---

### రాబర్ట్సు ప్రభువు.

సైనికులను, సేనానులను అభినందించుట.

లండను నవంబరు 6:—యుద్ధములో భారతీయ సైనికులును, ఆంగ్లేయసైనికులును చూపిన నిరుపమాన ధైర్యమునకు మెచ్చుకొనుచు, రాబర్ట్సుప్రభువు సర్. జాను ఫ్రెంచిగారిని, సర్ జేమ్సు విల్లికాక్సుగారిని అభినందించుచు, తంతివార్తలను పంపిరి. స్వాతంత్ర్యమును, ధర్మమును నిలువబెట్టుటకు కత్తిగట్టిన ఆంగ్లేయ సామ్రాజ్యమునకై భారతీయులు పోరాడుచున్నారని భారతీయసేనలకు రాబర్ట్సుప్రభువు స్వాగతమిచ్చుచున్నాడు.

---

### ఆంగ్లేయ పరాసు సేనలు

క్రమక్రమముగ ముందుకు పోవుట.

లండను నవంబరు 6:—వార్తాప్రకటన సంఘమువారిట్లు తెలియజేయుచున్నారు:— శత్రువు అంత తీవ్రముగ నెదిరించుటలేదు. వీరు క్రమముగ వెనుకకు నెట్టివేయబడుచున్నారు. దక్స్మూడికి దక్షిణమునను, ఘెంటువెల్టువే పునకును మిత్రమండలిసేనలు బాగుగా ముందుకు పోవుచున్నవి. కాని మంచుపట్టి చలిగా నుండుటచే నిరోధము కలుగుచున్నది.

---

### జర్మనివారి యౌవనసైనికులు.

లండను నవంబరు 6:—బకాలెరెజోలో మనము ఖైదీలుగ పట్టుకొన్న జర్మను సైనికుల దగను పదునైదు పదునారు సంవత్సరముల కుర్రవాండ్రు. వారు తగినట్లు శిక్షితులుచేయబడలేదు. వారికి దుస్తులు, మెదడైన వస్తువులైన చాలినన్నిలేవు. ఈ యౌవనసైనికులు గుంపులు గుంపులుగవచ్చి మనసేనలపైపడి యుద్ధముచేయక పడిపోయిరి. అని రష్యా దొరతనమువారు ప్రకటించిరి.

---

### శ్రీజార్జిసార్వభౌముడు.

ఆగాఖానుగారికి దర్శనమిచ్చి మాటాడుట.

లండను నవంబరు 6:— శ్రీజార్జిచక్రవర్తిగారు నేడు ఆగాఖానుగారికి దర్శనమిచ్చి మాటాడిరి.

---

### యూదు మతస్థులు.

పటాలములలో చేరుచుండుట.

లండను నవంబరు 6:— యుద్ధమునకు పంపుటకై గాను లండనులో యూదుమతస్థుల పటాలమొకటి సిద్ధముచేయబడుచున్నది. ఈమతస్థులలో వేయిమందివరకే రణరంగమున పోరాడుచున్నారు.

---

### నష్టమైన ఆంగ్లేయసైనికులు.

లండను నవంబరు 6:— మేజరు నెలు [illegible] గారు యుద్ధములో చనిపోయిరి. ఈక్రిందివారు దెబ్బలుతగిలి కొంతకాలము జీవించినతరువాత చనిపోయినారు:— రెండవలెఫ్టినెంటు ఎడ్డిసను, లెఫ్టినెంటు బోస్టిన్, లెఫ్టినెంటు డగ్లసు. చీ

లో వదలితి. వెనకటివలెనె యీవిధముగా వెన్నెట్టి సహాయముల వలె అప్పటిమాదిరె బయటికి వచ్చితిని. (అబ్బాస్ అలీ గారిచే క్రాస్ పరీక్షలో) 2.ంటికిఁంటకు లు బ్లునకుని బయలుదేరితిని. మామాను కన్న సుహావుసులో తాళీపని చేయుచున్నాడు. ఈ కలకు నాలైదు ప్రశ్నాసములు నేను మామానుకుగాను కె వ్యన్ని హాఫ సంవకు వెళ్లియుంటిని. నేను ముద్దాయితోడ గోలీకుంట్లాట ఆడితిని. బూంది తోగ నడ కలిపిన సలకన్నపుడు ముద్దాయి తన తేబులోనుండి యిచ్చెను. వాడు బూందిని యె క్కడ కొనెనో నెరుగను. బూందిని తినగానె నేను వాంతి చేసికొంటిని; నాకు తల దిమ్ముగానుండి, యేమియు తెలియకుండెను. సికిల్సా చేయ్యటకును వెరంబూరునకు వెంటదీసుకొ మోనే అలన. కాని, నాకాసు నిండా నొప్పియుండెను. బూంది విషయము మేజిస్ట్రేటుకోర్టులో చెప్పితిని. తోటకు తీసికొనిపోవుటకు పూర్వము పుట్టచోట్లకు తీసికొని వెళ్లుటను గురించి క్రింది కోర్టులో చెప్పితిని. రాయపేట పోలీసుస్టేషను యెందుకో తెలియదుగాని క్రాంబజారునకు దెను. తోటకు వెళ్లి పిచ్చెట్టు బావిలో పడవేయబడినటులకు నేనెవ్వరిని గాని చూడలేదు. చెవిపోగులను తీయుటకు పూర్వము ముద్దాయి మొట్టమొదట నన్ను కాలికడియములు నడిగెనని నేను క్రిందికోర్టులో చెప్పలేదు. (ఇది స్పష్టమైన ఖండనము కానేరదుగాన, నిందలో నేమియు నుపయోగమున్నటుల నాకు తోచదని న్యాయమూర్తిగారు సెలవొసగిరి) నాకోర్టులో గుడ్డ తుడిచిన విషయమును నేను క్రిందికోర్టులో చెప్పలేదు. ఏలయనగా, అప్పట నన్నావిషయమై యడుగలేదు.

ప్ర:— ఇప్పుడు నిన్నెవరైన నడిగిరా?

ఉ:— లే.

ప్ర:— దాని నిప్పుడు చెప్పుమని నిన్నెవ్వరడిగిరి?

ఉ:— గుడ్డ తుడిచిన విషయమై నేను క్రిందికోర్టులో చెప్పవలెనంలో నన్నా పొమ్మనిరి.

ఈతె చెక్కిడ సేర్పను విషయమై ముద్దాయి పక్షము న్యాయవాదులగు రయి సాక్షిని విచారించిన సందర్భమును పురస్కరించుకొని, యీ న్యాయవాదులగాయ, విచారణలో నందు నేరములు జరిగినిమ్మట కొన్నాళ్లకు పోలీసువారు పిలవాని యీతను పరీక్షించిరనియు, అమధ్యకాలమున వాడు యీతను నేర్పియుండవచ్చుననియు, న్యాయమూర్తిగారికి విన్నవించిరి.

న్యా. మీ రెప్పుడైన సీకను నేర్పుకొంటిరా?

జ్యూ. అయ్యా! నేర్చితిని.

న్యా. యీడురోజులలో!

జ్యూ. అవును మహాప్రభో.

న్యా. అటులైన నెను మిమ్ము సభినందించెద.

పిదప సాక్షి మొక్క వాజ్మూలము. నన్ను బావిలో ఒడక్రోయుటకు పూర్వమే నేను ముద్దాయి పెను సెలుసుడును. బావిలోనుండి బయటికివచ్చిన పిమ్మట నన్నా రాత్రి ఆదరించిన ఆ పంగడు జాలీస్త్రీకి నేను ముద్దాయియొక్క పేరును చెప్పలేదు.

పిచ్చెయొక్క తల్లియగు మునియమ్మాళు వాని మామను పిలుచుకొనవచ్చు నిమిత్తమై తాను వానిని సన్నస్సు వావునకు పంపుట; వాడు రాకపోవుట; మరునాడు పడుట మున్నగు విషయములను గురించి సాక్ష్యము చెప్పెను.

పూజారి మద్దర మొదలి సాక్ష్యము:— సెప్టెంబరు 13 వ తేదిన (నేరములు జరిగినరోజు) పిచ్చె ముద్దాయితోడ చింతాగ్రిపేటనుండి పెద్దమెట్ల పేపున పెళ్లుచుండగా చూచితిని. రాత్రి యింటికి వెళ్లినప్పుడు మునియమ్మాళు పిల్లవాడు యింటికి రాలేదన్నాదని నాతో చెప్పెను. నేను చూచిన సంగతి ఆమెతో చెప్పితిని. వ తురావాడ దయము మునియమ్మాళు తోడ బాబుపేటకు వెళ్లి, తిరుగునప్పుడు పిచ్చె తిరిగి వచ్చుచుండగా, పిచ్చె యొక్క మరణానికి మాడ వచ్చుటను చూచితిమి. ముద్దాయి తనను బావిలో త్రోసెనటుల పిచ్చె వెంటనే తలిదండ్రితో చెప్పెను.

సుంకరమజాతిస్త్రీ యగు తప్పమ్మాళు సాక్ష్యము:— ఆదివారమునాడు ప్రామాదు 11 గంటలకు పిచ్చె నాయింటికి వచ్చెను. వాడొక యంగవియ నెను ధరించియుండెను; ఒంటిలో గుడ్డలేదు. వానిపిలలనుండి నీరు కారుచుండెను. తనయింటికిద్దరు వచ్చితిని సుబ్రహ్మణ్య పిల్లవాడు తన్న వెళ్లితిని కలుచుకొని వచ్చి చెవిపోగుల నపహరించి తన్ను బావిలో బడద్రోసెనని పిచ్చె నాతో చెప్పెను. వానికి నేనొక గుడ్డ ఇచ్చితి; కొంతకాలమైన, పండునుగూడ నిచ్చితిని; పిమ్మట పడుకొనవచ్చి పడుకుండబెట్టితిని. మరునాడుదయమున పిల్లవానిని వానితల్లి వద్దకు పిలుచుకొని పోవుచుండగా, ఆమె దారిలోనే అగపడెను. (క్రాస్ పరీక్షలో) తన్ను సుబ్రహ్మణ్యము బావిలో త్రోసినటుల పిచ్చె నాతో చెప్పెనని నేను క్రిందికోర్టులో చెప్పితిని.

సా:— పిల్లవాడు నీవద్దకు వచ్చినప్పుడు వాడు తడిసి వానిమీదనుండి నీరు కారుచుండెనని చెప్పితివా? వానిపక్కన గాలిచి నీ వేమైన పిల్లవానికి మనవిచేసితివా?

సాక్షి:— వాని వీపునుండి నీరు కారుచుండెను వాని యొంటి తడిసియుండెను. వాని వీపుపై నీరు పోసినట్లుగా ఆగుపడెను.

రిక్షాతోలి యగు వేలు అనువాని సాక్ష్యము:— సెప్టెంబరు 13 వ తేది రాత్రి 9 గంటలకు రాయపేట ఆసుపత్రి కద్ద ఉడ్లండ్సు హోటలునెదుటనుండి పిచ్చెను ముద్దాయితోడ నుండి నది చూచితిని. పిల్లవానితోడ నడచిన యీనూ ముద్దాయి యేయని నేను చెప్పలేను. మరునాడుదయమున పిచ్చె, ముద్దాయి పోలీసువారు కొందరు ఉడ్లండ్సు హోటలులో నుండగా చూచితిని. అముందునాడురాత్రి పిచ్చెయును, ముద్దాయియు అనీటునద్ద నిలిచియుండగా చూచితినని నేను ఇన్ స్పెక్టరు గారితో వెంటనే చెప్పితిని. (క్రాస్ పరీక్షలో) ముద్దాయియు, పిచ్చె గూడ తోటలోనికి వెళ్లుటను నేను చూడలేదు. తోటలో అనేకులు వెళ్లుచుండలేదుగాని క్రాంబజారునకు డిసిని. అంతకు పూర్వము నేను ముద్దాయినిగాని, అపిల్లవానినిగాని చూచియుండలేదు వారు హోటలులోని ఒట్టరును చూచుటకు వచ్చియుండవచ్చునని తోచెను. కావున, నేను వారి నేమియు నడుగలేదు. ఆగ్రాత్రి యెక్కడైనను ఊదుటనుగాని, యేడ్చుటనుగాని నేను వినలేదు. ఆబావి ముద్దాయియు, పిల్లవాడును నిలబడియుండిన నెటునకు సమీపమున నున్నది. రిక్షా బండి దీపముల వెలుతురువలన నేను వారిని గుర్తించి తిలితిని.

సింగవేలు చెంబడివాని సాక్ష్యము:— ఉడ్లండ్సు హోటలు ఆవరణములో నొక బావి యుండి నెనెను గడ్డకుతీసితిని. నేను నీటిలో మునిగితిని. గుడ్డ నీటియందుగల నుండెను. బావిలో సుమారు పదియాకుగులలోతు నీళ్లుండెను.

ఉడ్లండ్సు హోటలును కొలుపున్నుకొనిన జి. వి. హిగ్గిన్ బాతంగారి సాక్ష్యము:— పోలీసువారు బావిలో వెదకినపుడు నేనచటనుంటిని. ఆ బావి దక్షిణద్వారము (గేటు) నకు రమారమి ముప్పదిగజముల దూరమున నున్నది. బావి బాటకగ్గర కంచెమీదనె యున్నది. నేను బావిదగ్గర వెళ్లిన పుడు ఒకడు నీటిలో మునుగుటను చూచితిని. ఇప్పుడు వాడు చూపిన గుడ్డనంటిగడ్డకు వాడు పైకి తెచ్చుటనుగూడ చూచితిని. బావిచుట్టు రెండడుగుల యెత్తుగల గోడగలదు. (న్యాయమూర్తిగారి ప్రశ్నలకు) ఆ బావి యేపనికిని యుపయోగింపబడుటలేదు. బావిలోని మెట్లు మిద్దెమెట్లవలె సమర్చి యున్నవి. పెద్దవారు సులభముగ నెక్కి రాకయున్నను, పసివాడికి కొంచెము కష్టము. వాడు మెమెట్లను ముందుగ చేతులతో పట్టుకొని పిమ్మట దానిమీది కెక్కవలయును. ఆ బావి యింటికి సుమారు 80 గజములదూరమున నున్నది. (క్రాస్ పరీక్షలో) హోటలు ఆవరణమునొక్క విస్తీర్ణ మెంతయో నాకు తెలియదు. కాని, అది పెద్దదని మాత్రము చెప్పగలను. బావిని వెదకినవాటికి ముందురాత్రి హోటలునకు సుమారు ముప్పదిగురు వరచేరియుండిరి. నేనే పెకేలుగాని, యేడుపుగాని వినలేదు. బావిలోని మెట్లన్నియు క్రమముగనె యున్నవి. కా, బావిచుట్టుగోడలో నెచ్చట్లైన పగిలి యున్నదో లేదో ఖచితముగ చెప్పలేను.

పిమ్మట, చిలవిషయములను దృఢపరచుటకై మరి కొందరు సాక్షులు విచారింపబడిరి.

ఉడ్లండ్సు హోటలు బట్లరుగు సరింగు అనువాడు బావి చుట్టుగోడలో నెందు పగిలి లున్నదనియు, పిల్లవాడు దానిమీదనుండి బయటికి వచ్చియుండవచ్చుననియు, అసంగులగూడ పనికిడ్డలు ప్రాయుటకు పోగలవచ్చునుగాని పెద్దవారు పోలేరని యు చెప్పెను.

తన్ను బావిలో త్రోసినవాడిపే రిదియని పిచ్చె తన తల్లితో చెప్పలేదని తప్పమ్మాళు పునరుద్ధరణమున చెప్పెను.

తన కేమియు తెలియదనియు, పిచ్చె చెవిపోగులను తన కడ్డ నాలుగేడుకొలను ఉడుపయుంచెననియు, దీని నొకపురుషుడును, ఒకస్త్రీయు నెలుగురువనియు ముద్దాయి క్రిందికోర్టులో చెప్పియుండెను; ఇంకెవన్న నెక్కువ చెప్పవలసినది తనకేమియు లేదని యీకోర్టులో చెప్పెను.

పిమ్మట, ముద్దాయి పక్షము, సాక్షుల విచారణ జరిగెను. జూరర్లు కలిసి యాలోచించి, మొదటి మూడునేరములవిషయమున ముద్దాయి నిర్దోషియనియు, నాల్గవ నేరమును గురించి వాని దోషియనియు అభిప్రాయమునెసగిరి. మొదట తెలుపబడినేరములలో వాడు దోషి యని యెంచకపోవుటకు, వివారణలో తామ కలిగియుండిన నేరములుమాత్రము స్థిరమైనందున, న్యాయమూర్తిగారు ముద్దాయి కొక్కపెలు ఠిని ఖైదును విధించిరి.

## ఒక జైజ్జీ కమీషను

బెంగాళీపత్రిక సూచన.

ఈ సమస్యాంశములు విచారణయందు తీర్మానించవలసిన విషయములను విస్పష్టపరచవలెనని బెంగాలీ పత్రికవారికి సూచించుచున్నది:—

(1) కొమగటామారు స్టీమరులోని సిక్కులు స్టీమరులోనుండియుండగానే వారివద్ద తుపాకులున్నవో లేవో తనిఖీ చేసిరా లేదా?

(2) తనిఖీచేసినచో తుపాకు లేవైన కనుబడినవా?

(3) ఒక ఆంగ్లేయోద్యోగిని పాల్గొనబడుటయును ఫర్ ఫ్రెస్ట్ ఇయా హా దేగారి గాయమును కలిగించిన తుపాకిగుండ్లను మరియు కచ్చా జారులో యీదుట కేల తీసికొని రాలేదు?

(4) ఆ తుపాకి పెక్కు లెన్ని? పెనీకు లుపయోగించు గుండ్లను యీ గుండ్లను ఒకమాదిరివేనా?

(5) సిపాయిలు తుపాకులను పేల్చినపుడు సిక్కులకు యెంతదూరములో ఆంగ్లేయోద్యోగులును గర్ ఫ్రెస్ట్ ఇయా హాలీడేగారును నిలిచియున్నారు?

(6) పోరాటమున సిపాయిలే వారిపైని తుపాకులు కాల్చియుండుట కవకాశము కలదా?

(7) చంపబడిన సిక్కులను గురించిన ప్రయత్నములేమైనచేయబడినవా? వారిపేరులను తెలిసికొని యున్నారా?

(8) చంపబడిన వారిలో సరదారు గురుదత్తసింగు కూడ కలడా?

(9) సిక్కుల నందరిని ఒక ప్రత్యేకపు రైలుబండిలో నెక్కించుటకు ప్రయత్నించిన నప్పుడు వారిని ప్రవాసమున కంపెదరేమోయని సిక్కులు సందేహముపొంది ఆ బండిలో నెక్కుటకు నిరాకరించి యుండవచ్చును గాన నట్టివో వారు లెక్కన ప్రయాణికుల తోపాటు మెయిలు ట్రెయినులలోనో మరియొక ట్రెయినులలోనో యెక్కి పంజాబునకు పోవ నేల నొసగలేదు?

(10) తుపాకులను కాల్చుటకు సిపాయిల కుత్తరువు నిచ్చిన వా రెవరు? మేజిస్ట్రేటా? పోలీసు కమీషనరా? లేక మరి యే యున్నతోద్యోగి యైన నిచ్చెనా? చచ్చినవారు చాలమంది కలరా? ఆ పోరాటమువలన కలిగిన సందరగోళములో సెందరుచచ్చిరో యెందరికి గాయములు తగిలినవో అధికారులు నిర్ధారణముగ తెలిసికొనజాలి యుండిరా?

(11) విజయదశమినాడు నదీతీరమున గుమిగూడిన చూపరులను పోరాటము జరిగిన ప్రదేశమునకు రాకుండ చేయుటకు తగినప్రయత్నములను పోలీసువారు ఏలచేయలేదు? అనుకొనదగిన అపాయములు స్పష్టపడబడలేదేల? పోరాటము జరిగిన వెంటనే ప్రకటింపబడిన కోరతనమువారి ప్రకటనముగం దీవిషయములెవియును స్పష్టముగ వివరింపబడలేదుగాన యీ విషయములను నిర్ధారణ చేయబడవలయునని పలువురు మాకు లేఖలను వ్రాసియున్నారు. కాన జవాబీప్రాయములన్నదనిమేము గ్రహింపగలిగితిమి. కాన నీరీతిని విచారణ జరిగినచో జనసంఘమునకు సంపూర్ణ విశ్వాసమును కలిగించుట కవకాశముండునని మేము తలంచుచున్నాము అని బెంగాలీపత్రిక (వ్రాయుచున్నది — హిందూ.)

## Occupation of Bayazid.

### A Great Feat of Arms.

PETROGRAD, November 6.

The occupation of Bayazid followed upon a wonderful march of fifty miles in thirty hours by a column representing all arms through mountain passes, deep in snow, one of the greatest Russian feats of war.

## Advance Against Turks.

### The Turkish Strength.

The General Russian advance against the Turks extends along a front of hundred miles. Turks are concentrating at Erzerum where the first important battle is expected. The Turkish strength is estimated at ninety thousand besides twenty thousand Kurdish irregulars. It is believed that the German General Liman Von Sanders is in command of the Turks.

(Associated Press Agency)

## A Police Officer's Suicide.

BANGALORE, November 7.

Mr. A. A. Lowe, retired Inspector of Madras Police aged 70 committed suicide late this afternoon by shooting himself with a quackenbush rifle through his head. He locked himself up in his room in Fraser Town and before his wife was able to summon assistance had shot himself. Captain Chamber I. M. S., happening to motor by at that time had the room broken open and declared Lowe beyond assistance. Inspector Smith of the Station police shortly afterwards held an inquest at which a verdict of suicide while temporarily insane was returned.

## All-India Weather.

SIMLA, November 7.

The disturbance affecting the north-west is very feeble and has so far given no result of importance. Rainfall has ceased in Bombay and increased somewhat in the south of the Peninsula. The chief amounts are:—Bassein and Cochin two inches; Madura, Cuddalore and Kodaikanal one, and Madras three quarters.

FORECAST:—Increase of rainfall along the north-west frontier.

